# పీఠిక

'జ్యోతిషార్ణవనవనీత' మనఁగా జ్యోతిష మనెడు సముద్రమును తరిచియెత్తిన వెన్న యని యర్థము. దీనిని రచించిన కవి పింగళి వేంకటరామశర్మ. గౌతమగోత్రజుఁడు; మైసూరుమండలవాసి. ఇతఁడు స్వవిషయము నీ విధముగా నెఱుకపఱిచెను.

గీ. ధర్మశాస్త్రప్రవర్తన తత్పరుండు
కర్మనిర్మాణచణమూర్తిగౌతముండు
నిర్మలంబగు తేజంబునీటుగుల్కఁ
బేర్మియుదయించె ఋషులెల్లఁబ్రీతిఁ బొగడ.

వ. అతనివలన గౌతమగోత్రం బుద్భవిల్లి యెల్లగోత్రంబులలోన తద్దయు వన్నెకెక్కుచుండం బెద్దకాలంబునకుఁ దదన్వయంబునందు.

క. లింగపురాణము తెనుఁగున
సంగతినాఁజేసి సాధుసంఘము మెచ్చన్
రంగారుకీర్తివడసిన
పింగళిసూరప్పపుట్టె పృథ్విఁ జెలంగన్.

ఉ. వేంకటరామరాజతని విశ్రుతవంశమునందుఁ బుట్టి ద
ర్పాంకురబుద్ధియై తనదుభావము మోదముఁ జెంద బుచ్చుచున్
వేంకటనాథపాదయుగవిస్ఫురితాదరభావ బంధురన్
పంకరుహేక్షణన్దనకు భామినిఁగాఁ బడసె న్నరేంద్రియుంబునన్.

మాధవరాయుఁడు పండిత
భూధవుఁడాతనికిఁ బుట్టె బుచ్చమయందున్
సాధువరుఁడు శ్రీరాముఁడు
మేధావంతుండు గలిగె మేదినిఁ బిదపన్.

క. శ్రీరామమూ_ర్తిగుణములు
సారమతులు వొగడుచుండ్రు సరసతమీాఱ౯
భూరమణు లెల్ల తత్పద
సారససేవా విశేషసాదరులెఱుఁగన్.

క. దశరథసుతుఁ డగు రాముఁడు
విశదంబుగ సీతఁ గొన్న విధముగ నతఁడు౯
శశితుల్య కీ_ర్తిఁ గైకొని
పశుపతి కాంతాసమాన పాపమకాంతన్.

క. తిరువేంగళకృష్ణమ్మను
వరసుతునిం బడసె వంశవర్ధను నతఁడు౯
వరకవియై భువిఁ బరఁగెను
సరిలేక జగంబులందు సంపద లొలయన్.

క. ఆతని కను జన్ముఁడనై
యాతన్వికిఁ బుట్టి యేను నతులితభ_క్తి౯
సీతాపతిపద సేవా
చాతురిఁ జేసితిని జగము సంతసమందన్.

గీ. జ్యోతిషార్ణవనవనీతసంజ్ఞ దాల్చు
గ్రంథ మొక్కటిఁ జేసితి గణన కెక్క
నెరసు లేరక దీనిలో నీటుగుల్కు
విషయముల నాదరింపుఁడు వేడ్క మీఱ.

గీ. ఏను వేంకటరామాఖ్య నెసక మెసఁగ
రహిని సింహాద్రి వేంకటరామగురుని
వలన జ్యోతిషశాస్త్రంబు వన్నెకెక్క
నభ్యసించితి భ_క్తితో నయముమీఱ.

దీనిం బట్టిచూడ నితఁడు సింహాద్రి వేంకటరామగురునొద్ద జ్యోతిః శ్శాస్త్ర మభ్యసించి తన యనుభవమును పురస్కరించుకొని స్వతంత్ర

ముగా నీ గ్రంథమును రచించినట్టు తోఁచుచున్నది. ఈతఁడు సుమారు వందసంవత్సరములక్రిందట నున్నట్టు తెలియుచున్నది. ఈ గ్రంథము జ్యోతిశ్శాస్త్ర మభ్యసింపఁగోరువారి కత్యంతము ప్రయోజనకరమైనది. ఇందు జ్యోతిశ్శాస్త్రఫలభాగము వివరింపఁబడినది. సాంకేతికముల నిర్వ చించినపిదప జన్మకాలఘటికల నిర్ణయించువిధానముం దెలిపి, దాని నాశ్రయించిన బాలారిష్ట నక్షత్రగండ అరిష్టభంగయోగములు విస్త రించి, తన్వాది ద్వాదశభావములను విపులతరముగా సూక్ష్మ సూక్ష్మతర పరిశీలనప్రాయము కావించియున్నాఁడు. తర్వాత గోచారభావమును అష్టకవర్గసముదాయబిందువివరణ అష్టకవర్గఫలములను ఖండత్రయవివ రణమును, డమరుకాదియోగములను భాస్కరాదియోగములను వివ రించెను.

విషయానుక్రమణికను పరిశీలించిన నీగ్రంథము శాస్త్రారంభకుల కెంతటియుపకారియో విశదమగును. ఇదివరలో భావార్థచంద్రిక యను నొకగ్రంథము ప్రత్యేకము భావలక్షణముల వేఱొకనునట్టిది యున్నను సర్వార్థచింతామణ్యాది యుద్గ్రంథములలోఁ బేర్కొన్నవిషయములను అనుభవమును క్రోడీకరించి విపులీకరించుగ్రంథ మిది యొక్కటియే యని చెప్పుట అతిశయోక్తి కాదు. ఒక్కొక్కభావమును విపులముగ చర్చించి ఆయాభావముల విషయమువ ప్రత్యేకముగా గ్రహము లేయే ఫలము లిచ్చునో చెప్పుట సులభమే యయినను ఆ గ్రహము లిచ్చు ఫలము లన్నిటియొక్క సగటు ఫలితమును నిర్ణయించుటమాత్రము అంత సుకరము గాదు. అందుల కీగ్రంథము కొంత సహకారి యగును. ఈ సందర్భమున మహీసూరు శ్రీకొప్పరంఅప్పయ్యగారు చేసిన కవిప్రశం సను పరికించిన గ్రంథప్రాశస్త్యము ఎఱుకపడును.

ఘనతర సుగుణ లగ్నస్ఫుటంబును గ్రహ
    స్ఫుటమును మఱి దశాభుక్తిసహిత
మైన నాయుర్దాయమువల షోడశకర్మ
    ములముహూర్తంబుల మొదలనెల్ల

చక్కఁగ పరులకు నక్కఱతోడను
వక్కాణమును జేసి వాంఛదీర్చు
టలయందు తమ రిల బలిమిఁజెందినవార
లని వినుతింతు వందనమమర్చి

తే. లాలితోల్లాస గణితకళావిలాస
ప్రబల సింహాద్రి వేంకటరామశిష్యుఁ
డలర పింగళి వేంకటరామవర్య
సుగుణధరసాంద్రదశదిశాకీర్తిచంద్రా.

క. పింగళి వేంకటరామా
ఖ్యం గలిగి యగణితశాస్త్రకాంతామణితో
రంగుగ నెప్పుడు ముదమూ
రంగా సుధియత్తురంగ పండితరంగా.

గ్రంథకర్తయు జనప్రియుఁడైన దైవజ్ఞుఁడయియుండె ననియె నిశ్చయింపఁదగును.

ఇట్టి యుత్తమగ్రంథమును ఖిలము గానీయక యుద్ధరించి ముద్రణ రూప మలవఱచిన భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి జ్యౌతిషికలోకము ఎంతో ఋణపడియున్నది. శ్రీ శాస్త్రులవా రింక నిలాటి గ్రంథరాజముల ప్రచురింపఁగలుగుటకై శ్రీగిరీశుఁడు వారి కాయురారోగ్యముల ప్రసాదించునుగాక!

చెన్నపట్టణము.
18-1-1953.

ఇట్లు,
వేదము లక్ష్మీనారాయణశాస్త్రి.

శ్రీ రస్తు.

# జ్యోతిషార్ణవ నవనీతము

పార్వత్యువాచ: దేవదేవ మహాదేవ త్రికాలజ్ఞ మహేశ్వర,
జ్యోతిషార్ణవపీయూషం సంక్షేపేణ వదస్వ మే.

తా. పార్వతీదేవి మహేశ్వరునిఁగాంచి యోదేవాధిదేవ! నీవు వర్తమాన భవిష్యద్భూతకాలముల నెఱింగినవాఁడవు. ఓమహేశ్వర ! నాకు జ్యోతిషార్ణవనవనీత మను గ్రంథమును సంగ్రహముగఁ దెల్పుము.

అనుగ్రహార్థం లోకస్య మయి కారుణ్యమాశ్రితః,
దైవజ్ఞశాస్త్రసారంచ ఫలభాగం వదస్వ మే.

తా. ఓదేవా ! లోకముల ననుగ్రహించుకొరకు నాయందు కారుణ్యముచేసి జ్యోతిషశాస్త్రమున సారముగనుండెడి ఫలభాగమును నాకు చెప్పుము. అని యడిగెను. అందుకు ఈశ్వరుఁడు చెప్పుచున్నాఁడు.

## ద్వాదశరాసులు

ఈశ్వర ఉవాచ: శృణు దేవి ప్రవక్ష్యామి సావధానేన చేతసా,
సప్తవింశతిఋక్షాణాం రాశయో ద్వాదశస్మృతాః.
మేషో వృషశ్చ యుగ్మంచ కర్కిసింహశ్చ కన్యకా,
తులా వృశ్చికచాపాశ్చ మకరః కుంభమీనకౌ.

తా. ఓదేవి పార్వతీ! నీవడిగిన జ్యోతిషశాస్త్రసారమును చెప్పెదను. జాగరూకత గలమనస్సుతో వినుము. అశ్విన్యాది ౨౭ నక్షత్రములకు మేషాది పండ్రెండురాసులు గలవు. అవి యెవ్వియనఁగా:— మేషము, వృషభము, మిథునము, కర్కాటకము, సింహము కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము.

## నవగ్రహములు

అర్కేన్ద్వారబుధాచార్యా భృగుమందాహి కేతవః,
గ్రహాశ్చరంతి నక్షత్రగత్యా మేషాదిరాశిషు.

తా. సూర్యుఁడు, చంద్రుఁడు, అంగారకుఁడు, బుధుఁడు, గురువు, శుక్రుఁడు, శని, రాహువు, కేతువు అని ౯ గ్రహములు గలవు. ఇవి అశ్విన్యాది నక్షత్రపాద గతులచే మేషాదిరాసులయందు సంచరింపుచుండును.

## గ్రహవీక్షణము

త్రిసప్తదశమాన్ సౌరీ త్రికోణంతు బృహస్పతిః,
చతురష్టౌ కుజస్సర్వే సప్తమే పూర్ణవీక్షణాః.

తా. సూర్యాది నవగ్రహములు సప్తమస్థానమును సంపూర్ణముగా వీక్షించుచున్నారు. శనైశ్చరుఁడు ౩, ౭, ౧౦-ఈస్థానములను, బృహస్పతి ౫, ౯-ఈస్థానములను అంగారకుఁడు ౪, ౮-ఈస్థానములను చూచుచున్నారు.

# గ్రహముల స్వక్షేత్ర, ఉచ్ఛక్షేత్ర, నీచక్షేత్ర, శత్రుక్షేత్ర, మిత్రగ్రహ, శత్రుగ్రహ, సమగ్రహములపట్టికము.

| నవగ్రహములు. | స్వక్షేత్రములు. | ఉచ్చక్షేత్రములు. | నీచక్షేత్రములు. | మిత్రక్షేత్రములు. | శత్రుక్షేత్రములు. | మిత్రగ్రహములు. | శత్రుగ్రహములు. | సమగ్రహములు. |
|---|---|---|---|---|---|---|---|---|
| సూర్యునికి. | సింహము. | మేషము. | తుల. | కుంభం. ధనస్సు. మీనము. | వృషభము. మిథునము. కర్కాటకము. కన్య. వృశ్చికము. మకరము. కుంభము. | చంద్రుడు. కుజుడు. గురువు. | శని. శుక్రుడు. | బుధుడు. |
| చంద్రునికి. | కర్కాటకము | వృషభము. | వృశ్చికము. | మిథునము. కన్య. ధనుస్సు. మీనము. | మేషము. సింహము. తుల. మకరము. కుంభము. | సూర్యుడు. బుధుడు. | ... | కుజుడు. గురువు. శని. శుక్రుడు. |
| అంగారకునికి. | మేషము. వృశ్చికము. | మకరము. | కర్కాటకము | వృషభము. మిథునము. కన్య. తుల. | సింహము. ధనుస్సు. కుంభము. మీనము. | గురువు. చంద్రుడు. రవి. | బుధుడు. | శుక్రుడు. శని. |
| బుధునికి. | మిథునము. కన్య. | కన్య. | మీనము. | మేషము. వృషభము. కర్కాటకము. తుల. వృశ్చికము. ధనస్సు. మకరము. కుంభము. | సింహము. | రవి. శుక్రుడు. | చంద్రుడు. | కుజుడు. గురువు. శని. |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| గురువునకు. | ధనుస్సు. మీనము. | కర్కాటకము | మకరము. | వృషభము. మిథునము. సింహాము. కన్య. తుల. కుంభము. | మేషము. వృశ్చికము. | చంద్రుడు. కుజుడు. | బుధుడు. శుక్రుడు. | రవి. శని. |
| శుక్రునికి. | వృషభము. తుల. | మీనము. | కన్య. | మేషము. మిథునము. వృశ్చికము. ధనుస్సు. మకరము. కుంభము. | కర్కాటకము. సింహాము. | బుధుడు. శని. | రవి. చంద్రుడు. | కుజుడు. గురువు. |
| శనికి. | మకరము. కుంభము. | తుల. | మేషము. | వృషభము. మిథునము. కన్య. ధనుస్సు. మీనము. | కర్కాటకము. సింహాము. వృశ్చికము. | శుక్రుడు. బుధుడు. | రవి. చంద్రుడు. కుజుడు. | గురువు. |
| రాహువునకు. | కన్య. | వృషభము. | వృశ్చికము. | మిథునము. కన్య. తుల. ధనుస్సు. మకరము. మీనము. | మేషము. కర్కాటకము. సింహాము. కుంభము | ... | ... | ... |
| కేతువునకు. | కుంభము. | మీనము. | కన్య. | మిథునము. తుల. వృశ్చికము. ధనుస్సు. మకరము. మీనము. | మేషము. కర్కాటకము. సింహాము. | ... | ... | ... |

శ్లో. సూర్యాదీనాం గ్రహాణాముచ్చస్థానాని చ స్మృతాః, రాహుకేత్వోస్తు సర్వేపి రాశయస్స్వగృహాస్మృతాః.

తా. సూర్యాదిగ్రహములకు ఉచ్చాది క్షేత్రములు గలవు. రాహు కేతువులకు ఎల్లరాసులును గృహములే. అనగా: వీరికి స్వాసాధారణమైన గృహములు లేవు.

## గ్రహసమయములు

శ్లో. మేషాదిలగ్న సంఖ్యాభిస్తేషాం స్థితిశఖేచరాన్,
సంగుణ్య చ సమైరా ప్తం ఫలమూహ్యం చ శేషకాన్. ౧
స్వశేషం స్వదశావర్ష సంఖ్యయా గుణయేత్పునః,
నక్షత్రైర్భాజితం శేషం గ్రహాణాం సమయాస్స్మృతాః. ౨
స్నానంవస్త్ర ధృతిశ్చైవ తిలకం జపసంజ్ఞికం,
శివపూజా చ హోమశ్చ విష్ణుపూజా ద్విజార్చనమ్. 3
నమస్కారం చ నవమం పశ్చా దద్రిప్రదక్షిణం,
వైశ్వదేవో ఒతిథేఃపూజా భోజ్యం విద్యావివర్ధనమ్. ౪
ఆక్రోశశ్చైవతాంబూలం వాగ్విలాసస్సభాస్థితిః,
జలపానం మదాలస్యం శయనామృతభక్షణే. ౫
గంధలేపశ్చసల్లాపో భోగో నిద్రా తథైవచ,
పరీక్షాచ గజాదీనాం గ్రహాణాం సమయాస్స్మృతాః. ౬
తచ్ఛేష మంగళృచ్ఛేషం స్వదశాబ్దేన వర్ధయేత్,
అంగేనహారితంచేష్టా చేష్టాస్స్యుస్సానువాయికాః. ౭
ఏకైకసమయే షట్చావస్థాస్స్యురితి కీర్తితాః. ౭౫

తా. మేషము మొదలుకొని లగ్నమువరకు అయినలెక్కను, తాను ఏగ్రహము యొక్కసమయ మెరుగఁ గోరుచున్నాఁడో ఆగ్రహము జన్మకాలమునందుండెడి రాశి వరకు మేషము మొదలుకొని యెంచి, యయినసంఖ్యచేత నెచ్చగుణించి, వచ్చినమొత్తమును ఉద్దిష్టగ్రహముయొక్క దశాసంవత్సరములసంఖ్యతో నెచ్చగుణించిన వచ్చినమొత్తము యిరువైయేడింట హారించగా శేషము గ్రహసమయ సంఖ్యయగును. అవియే స్నానాది సమయములు ఇరువదియేడు. ఆ గ్రహసమయసంఖ్యను ఆ గ్రహదశాసంవత్సరములచే నెచ్చగుణించి ఆరింట హరింపఁగా, వచ్చినశేషము సమయావస్థసంఖ్యయగును. అట్టి యవస్థలు ఒక్కొకసమయమునకు ఆఱు. అవి ఈక్రింద వివరింపఁబడును. శేషము లేని యెడల ఆఱవ యవస్థ యని యెంచుకోనగును.

౧ స్నానసమయము.
ఇందులోనవస్థలు.
1 మృత్తికాశౌచము.
2 దంతధావనము.
3 ముఖప్రక్షాళనము.
4 శీతోదకస్నానము.
5 ఉష్ణోదకస్నానము.
6 అభ్యంగస్నానము.

౨ వస్త్రధారణసమయము.
1 వస్త్రానయనము.
2 వస్త్రగ్రహణము.
3 ఉత్తరీయధారణము.
4 వస్త్రాచ్ఛాదనము.
5 పాదప్రక్షాళనము.
6 ఆచమనము.

3 తిలకసమయము.
1 ఆనయనము.
2 గ్రహణము.
3 ధారణము.
4 దర్పణవీక్షణము.
5 ఆమోదము.
6 దర్పణవిసర్జనము.

౪ జపసమయము.
1 భూశోధనము.
2 ఆసనానయనము.
3 ఆసీనత్వము.
4 ప్రాణాయామము.
5 అంగన్యాసము.
6 మూలమంత్రము.

౫ శివపూజాసమయము.
1 మృత్తికానయనము.
2 లింగాకరణము.
3 ఆవాహనము.
4 పూజనము.
5 ప్రదక్షిణము.
6 విసర్జనము.

౬ హోమసమయము.
1 అగ్న్యానయనము.
2 అగ్న్యావాహనము.
3 ఆజ్యాహుతి.
4 పరిషేచనము.
5 స్తోత్రము.
6 విసర్జనము.

౭ విష్ణుపూజాసమయము.
1 పాత్రశోధనము.
2 అభిషేచనము.
3 అర్ఘ్యపాద్యాచామ[ము
4 అర్చనము.
5 నైవేద్యము.
6 స్తోత్రము.

౮ ద్విజార్చనసమయము.
1 ఆనయనము.
2 పాదప్రక్షాళనము.
3 గంధపుష్పాద్యలంకా
4 అర్చనము. [రము.
5 ప్రదక్షిణము.
6 నమస్కారము.

౯ నమస్కారసమయము.
1 ఊర్ధ్వము.
2 పూర్వము.
3 దక్షిణము.
4 పశ్చిమము.
5 ఉత్తరము.
6 ఉపచారము.

౧౦ అద్రిప్రదక్షిణసమయము.
1 ఉద్యుక్తము.
2 నిర్గమనము.
3 మధ్యప్రవాసము.
4 గిరిప్రవేశము.
5 సేవనము.
6 అధిష్ఠానము.

౧౧ వైశ్వదేవసమయము.
1 అగ్న్యానయనము.
2 భూమ్యలంకారము.
3 హవిష్యానయనము.
4 ఆజ్యస్పర్శము.
5 పానీయము.
6 ఉపస్థానము.

౧౨ అతిథిపూజనసమయము.
1 దర్శనము.
2 శరణ్యము.
3 స్థితి.
4 వందనము.
5 అన్నదానము.
6 స్వస్థానము.

౧3 భోజనసమయము.
1 శుద్ధాన్నము.
2 సూపభోజనము.
3 పాయసాన్నభోజనం.
4 ఇష్టాన్నభోజనము.
5 బంధుసహితభోజనము
6 పుత్రమిత్రసహితభో
జనము.

౧౪ విద్యాసమయము.
1 విద్వజ్జనసల్లాపము.
2 విద్యాప్రసంగము.
3 వేదాంతశ్రవణము.
4 పురాణశ్రవణము.
5 వివాదన.
6 విప్రపూజ.

౧౫ ఆక్రోశసమయము.

1 భృత్యకోపము.
2 ప్రమాణకోపము.
3 కోపప్రసాదము.
4 స్త్రీప్రకోపము.
5 కోపఘాతము.
6 కోపము.

౧౬ తాంబూలసమయము.

1 ఆనయనము.
2 నిధానము.
3 గ్రహణము.
4 భుక్తము.
5 ఉల్లాసము.
6 హాసము.

౧౭ రాజవిలాసస్థితిసమయం.

1 పురాగమనము
2 దూతప్రేరణ.
3 మంత్రిజనాగమనము.
4 ఏకాకిత్వము.
5 మంత్రులతో ఆలోచనము.
6 ఛత్రచామరాదివిహరణము.

౧౮ సభాస్థితిసమయము.

1 రథారోహణము.
2 గజానయనము.
3 అశ్వానయనము.
4 గజారోహణము.
5 అశ్వారోహణము.
6 దేవతాసల్లాపము.

౧౯ జలపానసమయము.

1 మంత్రులకుజలదానం.
2 వర్ణజలదానము.
3 తాళవృంతానయనం.
4 సేవనము.
5 సమంత్రాజ్జలసేచనము.
6 జలవిసర్జనము.

౨౦ ఆలస్యసమయము.

1 హస్తప్రదానము.
2 ఆసీనత్వము.
3 శిఖామర్దనము.
4 కంఠమర్దనము.
5 స్తంభనము.
6 తన్నివారణము.

౨౧ శయనసమయము.

1 శయ్యాసనము.
2 శయ్యాసూత్రధారణము.
3 శయ్యోపరికనకసూత్రధారణము.
4 శయ్యోపరిశయనము.
5 శయ్యోపరిపరిసరణము
6 శయనోల్లాసము.

౨౨ అమృతభక్షణసమయం.

1 అమృతస్ఫుటశోధనము
2 స్వపరిజనానామమృతదానము.
3 ప్రాశనము.
4 అత్యంతమనోల్లాసము
5 అఖిలభూమివిహారము
6 అశ్వగజామృతదానం

౨౩ గంధలేపనసమయము

1 గంధాలంకారము.
2 పుష్పాలంకారము.
3 కస్తూరి తిలకధారణము.
4 ఆభరణాలంకారము.
5 కిరీటధారణము.
6 కిరీటవిసర్జనము.

౨౪ సల్లాపసమయము.

1 గృహసల్లాపము.
2 శృంగారము.
3 ఆలింగనము.
4 హాస్యము.
5 భుజగము.
6 గీతము.

౨౫ భోగసమయము.

1 భోగము.
2 భోగ్యము.
3 ఉపరతి.
4 బాధనము.
5 స్ఖలనము.
6 ఉచ్ఛ్రితనము.

౨౬ నిద్రాసమయము.

1 నిద్ర.
2 ఉన్మీలము.
3 గాఢనిద్ర.
4 ఉత్కృష్టనిద్ర.
5 స్వప్ననిద్ర.
6 ఉన్మీలనదర్శనము.

౨౭ రత్నపరీక్షసమయము.

1 అశ్వపరీక్ష.
2 గజపరీక్ష.
3 రత్నపరీక్ష.
4 వీణాప్రసంగము.
5 ఉభయచామరప్రాప్తి.
6 ఉభయఛత్రవిసర్జనము.

శ్లో. స్నానేధృతిర్వస్త్రధృతౌనృపస్స్యాద్విశేషకేభద్రమథోజపేచ,
లింగార్చనేశత్రుజయోవపాస్యుపాసేదుఃఖంజయోవిష్ణుపదార్చనేచ.
ద్విజార్చనేరాజ్యమథోనమస్కృతౌశుభంచశైలక్రమణేవిభాగ్యం,
అమంగళం చాప్యథవైశ్వదేవే తథైవభోగో౽తిథిపూజనేచ,
భుక్తౌతుభోగః ప్రతి భాషణేసుధీః ఆక్రోశనేదుఃఖముపైతిమర్త్యః,
తాంబూలకే స్త్రీసుఖవృద్ధిరేవ రాజ్ఞావిలాసే విజయస్సుఖాదిః,
సభాధికారైర్జలపానతస్సుఖంఆలస్యతాయామతిభీతిరేవ,
శయేచసౌభాగ్యవిహీనతాచసుఖాసనేత్రప్తిముపైతిమర్త్యః,
అలంకృతౌరాజ్యసుఖాత్ స్థితిశ్చస్త్రీభాషణేభోగముపైతిభోగీ.
కాంతాసుతప్రాప్తిముదాహరంతినిద్రాంతరేభోగవిహీనతాచ,
ధనాగమోరత్నపరీక్షణేచఫలానిజ్ఞేయానిబుధైరిదంక్రమాత్.

టీక. మర్త్యః = మనుజుఁడు అయాగ్రహములయొక్క; ౧. స్నానే = స్నాన సమయముననుండినప్పుడు జనించెనేని; ధృతిః = ధైర్యమునుబొందును. ౨. వస్త్రధృతౌ= వస్త్రధారణసమయమందు ; నృపస్స్యాత్ = రాజగును. ౩. విశేషకే = తిలకధారణ సమయమందు; భద్రం = క్షేమమును బొందును. ౪-౫. జపేచలింగార్చనే = జపసమయ మందును లింగార్చనసమయమందును; శత్రుజయః = శత్రుజయముకలుగును. ఉపాసే= ఔపాసనసమయమందు; దుఖం = దుఃఖముకలుగును. ౬. విష్ణుపదార్చనేచ = విష్ణుపూజా సమయమందు; జయః = జయముకలుగును. ౭. ద్విజార్చనే= ద్విజార్చనసమయమందు; రాజ్యం = రాజ్యముకలుగును. ౯. నమస్కృతౌ = నమస్కారసమయమందు; శుభంచ = మంగళమును బొందును. ౧౦. శైలక్రమణే=గిరిప్రదక్షిణసమయమందు; విభాగ్యం=దారిద్ర్యమునొందును. ౧౧. వైశ్వదేవే=వైశ్వదేవసమయమందు; అమంగళం = అశుభమును బొందును. ౧౨. అథిపూజనేచ=అతిథిపూజాసమయమందు; భోగః=భోగము కలుగును. ౧౩ భుక్తౌతు=భోజనసమయమునందు; భోగః = భోగముకల్గును. ౧౪. ప్రతిభాషణే = విద్యాసమయమందు ; సుధీః=పండితుఁడగును. ౧౫. ఆక్రోశనే =ఆక్రోశసమయమందు; దుఃఖం = వ్యసనమును బొందును. ౧౬. తాంబూలకే = తాంబూలసమయమందు ; స్త్రీసుఖవృద్ధిరేవ = స్త్రీలవలన విశేషసుఖము గలుగును. ౧౭. రాజ్ఞావిలాసే = రాజ విలాస సమయమందు ; విజయః = జయము కలుగును. ౧౮. సభాధికారే = సభాస్థితి సమయమందు; సుఖాదిః = సుఖము మొదలగునవికలుగును. ౧౯. జలపానతః=జలపాన సమయమునందు; సుఖం = సుఖము కలుగును. ౨౦. ఆలస్యతాయాం = ఆలస్య సమయ

మందు; అతిభీతిరేవ = మిక్కిలి భయముకలుగును. ౧౧. శయేచ=శయ్యాసమయమందు; సౌభాగ్యవిహీనతాచ = కాంతిహీనత్వము గలుగును. ౧౨. సుఖాసనే = అమృతపాన సమయమందు; మర్త్యః=మనుజుఁడు; తృప్తిం=తృప్తిని; ఉపైతి = పొందుచున్నాఁడు. ౧౩. అలంకృతౌ = గంధలేపనసమయమునందు; రాజ్యసుహృత్ స్థితిశ్చ = రాజ్యమును స్నేహితులును గలిగియుండుట కలుగును. ౧౪. స్త్రీభాషణే = స్త్రీసల్లాపసమయమందు ; భోగముపైతి = భోగమును పొందుచున్నాఁడు. ౧౫. భోగే=స్త్రీసంభోగసమయమందు; కాంతాసుతప్రాప్తిం = భార్యయు పుత్రులుకలుగుటను; ఉదాహరంతి = చెప్పుచున్నారు. ౧౬. నిద్రాంతరే = నిద్రాసమయమందు; భోగవిహీనతాచ = సుఖము లేమియుకలుగును. ౧౭. రత్నపరీక్షణేచ = రత్నపరీక్షాసమయమందు; ధనాగమః=ధనప్రాప్తియు కలుగునని; బుధైః = పండితులచేత; ఇదం = ఈ ఫలము; క్రమాత్ = క్రమముగా; విజ్ఞేయాని = ఎఱుఁగనగును.

### దైవమానుష రాక్షసమండలములు

శ్లో. గ్రహాధిష్ఠితరాశ్యంతం మేషాది గణయేద్బుధః,
తాం సంఖ్యాం మేషరాశ్యాదిజన్మలగ్నాత్త సంఖ్యయా,
గుణీకృతాంతు గణనాం సప్తవింశతిభి ర్హరేత్,
శేషంమండలమాఖ్యాతం అశ్విన్యాదివిచింతయేత్.

తా. మేషరాశిమొదలు సూర్యాదిగ్రహములుండు రాశివరకు లెక్కించి, దానిని మేషరాశిమొదలు జన్మలగ్నము వరకు లెక్కించి, వచ్చినసంఖ్యచేత పెంచి, యామొత్తమును ౨౭ చే భాగించగా శేషించినలెక్కను అశ్విని మొదలుగా నెంచి, వచ్చిన నక్షత్రము దేవగణమునందు చేరియుండిన దేవమండలమనియు, మానుషగణములో చేరియుండిన మానుషమండలమనియు, రాక్షసగణమునందు చేరియుండిన రాక్షసమండలమనియు తెలిసికొనవలయును.

### దేవ, మనుష్య, రాక్షసగణములు

శ్లో. మృగః పునర్వసూ పుష్యం స్వాతీ శ్రోణా చ రేవతీ,
అనూరాధాశ్వినీ హస్తా ఏతే దేవగణా స్మృతాః. ౧

తా. మృగశిర, పునర్వసు, పుష్యమి, స్వాతి, శ్రవణం, రేవతి, అనూరాధ, అశ్విని, హస్త—ఇవి దేవగణములు.

శ్లో. ఉత్తరత్రితయం పూర్వాత్రితయం రౌద్రమేవచ,
భరణీ రోహిణీచైతే తథా మర్త్యగణాస్మృతాః. ౨

తా. ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణి, రోహిణి, ఆరుద్ర—ఇవి మానుషగణములు.

శ్లో. మఖా ధనిష్ఠాశ్లేషాగ్నివిశాఖా జ్యేష్ఠమూలకాః,
చిత్రాశతభిషక్చైవ గణాః రాక్షససంజ్ఞకాః. 3

తా. మఖ, ధనిష్ఠ, ఆశ్లేష, కృత్తిక, విశాఖ, జ్యేష్ఠ, మూల, చిత్త, శతభిష—ఇవి రాక్షసగణములు.

## ౙ గ్రహశీలములు ౙ

రవి. శిల, సువర్ణ, విష, వస్త్ర, వాహన, సేతు, వల్లభ, హస్తి, వాద, మంత్ర, ప్రభు, నేత్ర, కీర్తి, ప్రభా, కర్మ, తపః, శస్త్ర, క్షేత్ర, మనః, ధీ, జ్ఞానోదయ, దుర్గారణ్య, రథగజతురగపదాతి, నగర, పితృకారకుడగును.

చంద్రుడు. సురత, గంధ, కుసుమ, రజిత, వస్త్ర భూషణ, ఘృత, తైల, శాంతి, సుశీతల, ధాన్య, వాణిజ్య, మనోబుద్ధిప్రసాద, ధవళచ్ఛత్రచామర, యశస్, దయా, కాంతి, ముఖలావణ్యమాతృకారకుడగును.

అంగారకుడు. రక్తోత్పల, నేత్ర, సువర్ణ, తామ్ర, నివాస, తపశ్శీలోద్యోగ, క్షత్రియ, పిత్త, మూర్ఛరోగ, చోర, వ్రణ, పరాక్రమ, సంగ్రామ, శూరత్వ, విజయ, విఖ్యాతి, సేనాధిపత్య, నేత్రత్వ, పరశు కుంతశక్తి ప్రముఖదివ్యధనుర్ధరణ, పుణ్య, ధృతి, గాంభీర్య కామ క్రోధలోభమోహ, శత్రువృద్ధి, ఆగ్రహ, సత్వ, దార్ఢ్య, స్వాతంత్ర్య, భాతృకారకుడుగా నగును.

బుధుడు. స్మృతి, శిష్టాచార, గురు, మంత్ర, రహస్య, నాసిక, వర్ణ దంత, మాతుల, నృత్య, గాన, వైద్య, ప్రజ్ఞా, వినయా, అధ్యయన, అధ్యాపన, మాతుల, పౌత్రీ, మిత్ర, సంతతశాంతి, వినయ, భుక్త, బాంధవ, జ్ఞాతి, గోత్ర, సమృద్ధి, గణిత, విద్యా కారకుడుగానగును.

గురువు. మంగళ, దీక్షా, పౌష్టిక, యాగ, రాష్ట్ర, ధన, ఆసన, దాన, సువర్ణ, పూజ, సుఖ, బుద్ధి, మూర్తి, సుత, బంధు, మిత్ర,

సౌభాగ్య, సంక్షోభపనయన, గుప్త, వాగ్ధోరణి, మంత్ర, రాజ తంత్ర, గజతురంగబోధ, పుత్రజనన, కర్మ సింహాసనకారకుడు గానగును.

శుక్రుడు. మణి, భూషణ, వాహనాందోళికాదిఛత్ర, ఛామర, గురు త్వ, సుఖ, గజ, యువతీవివాహ, ధనధాన్య, నీతి, ఉత్సాహ, రాజ్య, సామ్రాజ్య, వైభవ, భోగ, సంగీత, సాహిత్య, శృంగారరసాద్భుతరస, మదనయువతీకేళీవిలాస, సౌందర్య, రాజముఖవశీకరణ, కావ్య, గణికా, అలంకార, ఆరామ, దీర్ఘి కా, ధేను, గారుడేంద్రజాల, వైశుధ్య, అణిమాద్యష్టైశ్వర్య, భోగ, సింహాసన, కోశ కళత్రకారకుడగును.

శని. సీస, లోహ, ఆయుఃకాల, వృషభ, మహిష, కృషిధాన్య, ముఖ భూతబంధన, జరామరణ, దాస, దాసీ, మదకార, ధన కారకుడగును.

రాహువు. మూర్ఖ, శత్రు, చోర, విష, పితామహకారకుడగును.

కేతువు. మాతామహ, సన్యాస, జ్ఞాన. మోక్ష, తీర్థయాత్రాకారకు డగును.

జన్మకాలఘడియలను నిర్ణయించువిధము

శ్లో. జన్మకాలస్య ఘటికా చతుర్గుణాస్తతఃపరం,
మేషాదితత్కాలలగ్నసంఖ్యయామిళితంపునః.
సప్తవింశతిభిర్హృత్వా శేషం స్యాజ్జన్మ తారకం,
తన్నక్షత్రస్యదశమం తస్మాచ్చదశమం తు భమ్.
తన్నక్షత్రదశానాథదశభం చేన్న సంశయః.
అన్యథాజన్మకాలస్యఘటికాం ద్వైవచింతకః,
న్యూనాంవాప్యధికాంకృత్వానిర్ణేతవ్యంతుపూర్వవత్.

తా. జన్మకాలఘడియలను నాలుగుతో హెచ్చించి, ఆసంఖ్యతో మేషము మొదలు జన్మకాలలగ్నముపరకుఎంచి వచ్చినసంఖ్యనుచేర్చి, ౨౭ చే భాగించి, శేషించినసంఖ్యను అశ్విన్యాదిగా ఎంచగావచ్చిన నక్షత్రము జన్మనక్షత్రమై యుండెనేని, లేక ౧౧ ౧౯-వ నక్షత్రమైనను దానికి ౧౦-వ నక్షత్రమైనను జన్మనక్షత్ర దశానాథుని ...

నక్షత్రముగనుండిన ఆ జన్మకాలఘడియలు స్ఫుటమని నిశ్చయించుకొనవలయును. అట్టుల పైనక్షత్రములు కాకుండిన జన్మకాలఘడియలను తగ్గించిగాని, హెచ్చించిగాని పైన చెప్పిన ప్రకారము జన్మకాలఘడియలను స్ఫుటము చేయవలయును.

## లగ్నసందేహము తెలిసికొనువిధము

శ్లో. జన్మకాలేతు సంప్రాప్తే లగ్నం నిశ్చిత్య పండితః,
తస్మిన్కాలే ఖేచరణాంచారం నిశ్చిత్య యోజయేత్.

తా. జన్మకాలము సంప్రాప్తమగుచేని యాకాలమునందు గ్రహములయొక్క సంచారమును నిశ్చయించుకొని లగ్నమును నిశ్చయము చేసికొనవలయును.

శ్లో. సూర్యోదయగతానాడ్యస్తాసామర్ధేనసంఖ్యయా,
సూర్యఋక్షం భవేదృక్షం సద్యోలగ్నస్య నిర్ణయః.

తా. సూర్యోదయాదిగతించిన ఘడియలు సగముచేసికొని, యా ఘడియలను సూర్యుడుండెడి నక్షత్రసంఖ్యతోఁ గలుపఁగా నెంతలబ్ధమగునో, యన్నవనక్షత్రముగల రాశి జన్మలగ్నమని యెఱుంగవలయు. మఱియొకవిధము: జన్మకాలఘడియల ౬-వ సంఖ్యచే హెచ్చగుణించి, యాయా నెలల తేదులు గలుపుకొని, ముప్పదింటిచే భాగింపఁగా లబ్ధసంఖ్యలెన్నో ఆ సంఖ్యగలరాశిని, సూర్యుడుండెడిరాశిని వదలి, మీదటిరాశి మొదలు కొని యెంచుకొనగా నేర్పడ్డలగ్నము జన్మలగ్నముగా నెఱుంగనగును. ఉదాహరణము: నందనసంవత్సరశ్రావణ శుద్ధపంచమినాడు పదునైదుఘడియలకుఁ బుట్టినవానికి పూర్వోక్త ప్రకారము లగ్ననిర్ణయము చేయుంవిధము.

జన్మకాలఘడియలు ౧౫-టిని ౬౦-టిచే హెచ్చగుణింపఁగా నైన మొత్తము ౯౦ ఇందుకు సంక్రమణతేదులలెక్క ౧౬ కలపఁగా వెరశి మొత్తము ౧౦౬-కి ౩౦-చే భాగము గొనగా లబ్ధము 3 సూర్యుడుండురాశి కటకము, దానినివదలి సింహము మొదలుకొని లెక్కించి మూఁడవదియగు తులను లగ్నముగాఁ గొనసగును.

శ్లో. చంద్రలగ్నాధిపోయత్ర తత్త్రికోణ మథాపివా,
తత్సప్తమ త్రికోణంవా చంద్రలగ్నముదీరయేత్.

తా. చంద్రుడుండెడిరాశి జన్మలగ్నమగును. కానియెడల చంద్రుని కేడవరాశి జన్మలగ్నమగును. అది కానియెడల ఆచంద్రుని కేడవరాశికి అయిదవదిగాని, తొమ్మిదవది గాని జన్మలగ్నమగును. చంద్రునికి అయిదు తొమ్మిదిరాసులు జన్మలగ్నములగును. కాని యెడ చంద్రుడుండెడి రాశ్యధిపతియుండెడిలగ్నము జన్మలగ్నమగునని యెఱుంగనగును. కానియెడల వానికి ౫, ౯ రాసులైనా జన్మలగ్నము లగును. అది కానియెడల

ఆ చంద్రరాశ్యధిపతికి సప్తమము లగ్నమగును. ఆ సప్తమస్థానమునకు ౫ ౯ రాసులు జన్మలగ్నములగును. ఇట్లు కానియెడల జననఘడియలు పొరపాటని యెఱుంగవలయును.

శ్లో. సూర్యలగ్నాధిపో యత్ర తత్త్రికోణమథాపివా,
తత్సప్తమత్రికోణం వాసూర్యలగ్నముదీరయేత్.

తా. పూర్వోక్తశ్లోకమునందు చంద్రునిబట్టి లగ్నమెఱింగినవిధముగ, ఈశ్లోకము నందు సూర్యునిబట్టి సూర్యలగ్నము నెఱుంగవలయును.

జన్మలగ్నము తెలియనియెడల నెఱుంగువిధము

శ్లో. ఆరూఢాధిపతి ర్నీచనాయకో యత్రసంస్థితః,
తదీశాధిష్టితం రాజ్యంలగ్నంబ్రూయాద్విచక్షణమ్.

తా. ఆరూఢము అడిగినలగ్నమే జన్మలగ్నము. కాదేని ఆలగ్నాధిపతికి నీచ క్షేత్రము జన్మలగ్నము. అదికాదేని ఆనీచక్షేత్రాధిపతి యుండురాశి లగ్నము..కాదేని ఆ నీచక్షేత్రాధిపతి యుండురాశికి అధిపతియుండురాశి లగ్నము అని యెఱుంగ వలయును.

జన్మనక్షత్రము తెలియనియెడల నెఱుంగువిధము

శ్లో. పృచ్ఛకస్యభవేల్లగ్నం బుతుఘ్నం నాడికాయుతం,
చరే చ పంచసంయుక్తం స్థిరేచ దశసంయుతం.
ద్విస్వభావేతిథిర్యుక్తం సప్తవింశతి భాజితం,
తచ్ఛేషం జన్మనక్షత్రంభవత్యేవ నసంశయః.

తా. ప్రశ్నచేసినకాలమునకు సరియైన లగ్నముయొక్క మేషాదిగానైన లెక్కను ఆరింటబెంచి, ఆకాలపుఘడియలఁ జేర్చుకొని చరరాశియగునేని ౫ టిని, స్థిరరాశి యగునేని ౧౦-టిని, ద్విస్వభావరాశియగునేని పదునైదును కలుపుకొనఁగానైన మొత్తము యిరువదియేడింట భాగించగా, మిగిలిన శేషము జన్మనక్షత్రమగును. ఘడియలు తప్పితే తప్పిపోవును.

గండపురుషలక్షణము

శ్లో. మాఘ ఫాల్గున వైశాఖ శ్రావణేషు నభోగతః,
పాతాళ మాశ్వయుక్చైత్రభాద్రపత్కార్తికేషుచ. ౧
జ్యేష్ఠాషాఢే మార్గశీర్షే పుష్యేపృథ్వీతలోపరి,
గండాఖ్యఃపూరుష స్తిష్ఠేత్తత్ఫలం తత్వతోవదేత్. ౨

శుభంనభసిపాతాళే భూమేరుపరిగండదః,
జన్మమాసానుగుణ్యేన విజ్ఞేయం తత్ఫలం బుధైః. 3

తా. గండపురుషుఁడు మాఘ, ఫాల్గున, వైశాఖ, శ్రావణమాసములయందు ఆకాశమునందును-ఆశ్వయుజ, చైత్ర, భాద్రపద, కార్తికమాసములయందు పాతాళమునందును-జ్యేష్ఠ, ఆషాఢ, మార్గశీర్ష, పుష్యమాసములయందు భూమిమీఁదను ఉండును. ఈగండపురుషుఁడు ఆకాశమునందుండఁగాను పాతాళమున నుండఁగాను పుట్టినవారికి శుభఫలము; భూమిమీఁద నుండఁగాఁ బుట్టినవారికి అశుభఫలము కలుగుచుండును.

## పుత్రజనకాల కర్తవ్యము

శ్లో. అథాతస్సంప్రవక్ష్యామి జాతేనైవశుభాశుభం,
జాతమాత్రే కుమారేతు ముఖంతస్యావలోకయేత్.
పితాఋణాద్విముచ్యేత పుత్రస్యముఖదర్శనాత్,
కృత్వాజాతంపితాసూనోః సచేలస్నానమాచరేత్.
ఉత్తరాభిముఖోభూత్వా నద్యాంవా దేవఖాతకే,
హ్రదేవా పుష్కరిణ్యాంవా బ్రాహ్మణైరనుమంత్రితః,
దత్వాగోభూహిరణ్యాది పశ్చాల్లగ్నంపరీక్షయేత్.
లగ్నమేవ ప్రశంసంతి జ్యోతిశ్శాస్త్రవిదో జనాః.

తా. పుత్రజననమువలన కలుగునట్టి శుభాశుభఫలములను నిఁక వచించెదః—పుత్రుఁడు జనించినతోడనే శిశువుయొక్క ముఖమును తండ్రి చూడవలయును. అటుల చూచుటవలన తండ్రికి తన పితృదేవతలఋణము విమోచనమగును. పిదప బ్రాహ్మణానుజ్ఞనుపొంది నదియందుఁగాని, తటాకమునందుఁగాని, బావియందుఁగాని, హ్రదమునందుఁగాని, ఉత్తరాభిముఖముగా సచేలస్నానముచేసి, తర్వాత జాతకర్మ గోభూసువర్ణాది దానములుసలిపి, శిశువుయొక్క జననకాల లగ్నమును జ్యోతిశ్శాస్త్రపండితులగు పెద్దలవలన తెలిసికొనవలయును. ఏల యనఁగాః జ్యోతిశ్శాస్త్రవేత్తలయినవారు లగ్నమే ప్రధానమని చెప్పుచున్నారు.

## బాలారిష్టము

శ్లో. భౌమాంశకస్థితే మందే భౌమేనైవ నిరీక్షితే,
రాహుదృష్టియుతేవాపి వర్షమేకంసజీవతి.
శుక్రాంశకస్థితేమందే శుక్రేణైవనిరీక్షితే,
కేతుదృష్టియుతేవాపి త్రివర్షం తస్యజీవితమ్.

శౌమ్యాంశకస్థితేమందే సౌమ్యైనైవనిరీక్షితే,
సూర్యదృష్టియుతేవాపి త్రివర్షంతస్యసజీవితమ్.
అర్కాంశకస్థితేమందే ఆర్కేణైవనిరీక్షితే,
కావ్యదృష్టియుతేవాపి చాతుర్వర్షంచజీవతి.
చంద్రాంశకస్థితేమందే చంద్రేణైవనిరీక్షితే,
దేహాధిపే నసందృష్టేషడ్వర్షంతస్యజీవితమ్.
అథవాచాష్టమేవర్షేన జీవతి నసంశయః,
జీవాంశకస్థితేమందే జీవేనైవనిరీక్షితే,
చంద్రదృష్టియుతేవాపి చాతుర్వర్షంసజీవతి.

తా. జననకాలమునందు శని అంగారకాంశము నందుండి అంగారకునిచే చూడఁబడినను, లేక రాహువుచే చూడఁబడినను నాశిశువు ౧ సంవత్సరము జీవించియుండును. మఱియు శని శుక్రాంశము నందుండి శుక్రునిచే చూడఁబడినను, లేక కేతువుచే చూడఁబడినను 3 సంవత్సరములవరకు జీవించియుండును. మఱియు శని బుధాంశము నందుండి బుధునిచే చూడఁబడినను, లేక సూర్యునిచే చూడఁబడినను 3 సంవత్సరముల వరకు జీవించియుండును. మఱియు శని సూర్యాంశము నందుండి సూర్యునిచే చూడఁబడినను, లేక శుక్రునిచే చూడఁబడినను ౪ సంవత్సరములు జీవించియుండును. మఱియు శని చంద్రాంశమునందుండి చంద్రునిచే చూడఁబడినను, లేక దేహాధిపతిచే చూడఁబడినను ౬ సంవత్సరములవరకు జీవించియుండును. లేక ౮-వ సంవత్సరము తప్పక మరణమును పొందును. మఱియు శని గురువుయొక్క అంశము నందుండి గురువుచే చూడఁబడినను, లేక చంద్రునిచే చూడఁబడినను ౪ సంవత్సరములవరకు జీవించియుండును.

శ్లో. చతుష్టయగతోరాహుః పాపైర్యదినిరీక్ష్యతే,
జాతస్యమరణందద్యాద్దశాబ్దే షోడశేఽథవా.

తా. ౪-వ స్థానమునందు రాహువుండి వానిని పాపగ్రహములు చూచిరేని జాతకునికి ౧౦ లేక ౧౬-వ సంవత్సరమునందు మరణము గలుగును.

శ్లో. ద్వాదశేరవిమందౌచక్షీణచంద్రస్తుసప్తమే,
పితుర్మరణదస్సద్యఃశుభదృష్టౌత్రియబ్దకే.

తా. ద్వాదశమందు రవి శని, సప్తమమునందు క్షీణచంద్రుఁడు నుండిరేని తత్క్షణమే తండ్రికి అరిష్టమును గలుగఁజేయును. శుభగ్రహములు చూచిరేని 3 సంవత్సరములకుపైన అరిష్టము కలుగును.

శ్లో. ఆదిత్యచంద్రమందాశ్చ పంచసప్తవ్యయే స్థితాః,
పితరం మాతరంహన్యుశ్శిశుం చాపిననంశయః.

తా. జననకాలమునందు సూర్యుఁడు, చంద్రుఁడు, శని ౫-౭-౧౨ యీ స్థానములలో నుండిరేని, తల్లికి తండ్రికి శిశువుకు గండము కలుగును.

శ్లో. రంధ్రస్థానేస్థితాస్సర్వేగ్రహాః ప్రాణహరాశ్శిశోః,
తస్మిన్‌స్థితోధరాసూనుఃమాతులస్యమృతిప్రదః.

తా. జన్మలగ్నమునకు ౮-వ యింట సూర్యాది యేగ్రహములున్నను శిశువుకు అరిష్టము; అంగారకుఁడు ఉండెనేని మేనమామలకు అరిష్టము.

శ్లో. ఉదయేభూమిపుత్రస్తు సప్తమేసహితౌశిశోః,
సూర్యసౌరీ యదిస్యాతాం సద్యోమరణసూచకౌ.

తా. జన్మలగ్నమునందు కుజుఁడు, ౭-వ యింట సూర్యశనులు చేరియుండిరేని పుట్టినశిశువు అప్పుడే మరణముజెందును. (శుభగ్రహములు కేంద్రమునుపొంది పైచెప్పిన పాపులను చూచినట్లయితే మరణము కలుగదు.)

శ్లో. విషమాంశగతేచంద్రేజాతో యమపురీంవ్రజేత్.

తా. చంద్రుఁడు విషమరాశిని పొందినను, విషమాంశను పొందినను, శిశువుకు మరణము కలుగును.

శ్లో. వ్యయేచంద్రోవ్యయేసౌరి స్సర్వేపాపామృతిప్రదాః,
లగ్నాష్టమస్థారంధ్రస్థాశ్చంద్రార్కౌయదిభూమిజః.

తా. జననకాలమందు ౧౨-వ యింట చంద్రుఁడు, లగ్నమందు శని యుండినను; లగ్నమందు అష్టమమందు వ్యయస్థానమందు కుజుఁడు ఉండినను శిశువుకు మరణము కలుగును. (గురుదృష్టియుండిన మరణము కలుగదు).

శ్లో. లగ్నాదష్టమగశ్చంద్రో లగ్నచంద్రాష్టమంతథా,
క్రూరగ్రహైనిరీక్షంతే జాతస్యమరణంధ్రువమ్.

తా. జన్మలగ్నమునకు అష్టమమందు చంద్రుఁడు ఉండినను లగ్నము; చంద్రుఁడు అష్టమస్థానము-వీనిని పాపగ్రహములు చూచినను శిశువుకు మరణము కలుగును.

శ్లో. ఉదయాస్తగతాఃపాపాః సద్యోమరణసూచకాః,
షడష్టమేవిధుః పాపాఃకర్మస్థామరణప్రదాః.

తా. లగ్నము ఏడవస్థానము వీనియందు పాపగ్రహములు, ఆఱు ఎనిమిది వీని యందు చంద్రుఁడు ఇటుల నుండిరేని తక్షణమే శిశువు మృతిబొందును. పదియవస్థానమందు పాపగ్రహములు నుండిరేని శిశువుకు అరిష్టము కలుగును.

శ్లో. పాపాస్త్రికోణకేంద్రస్థాశ్శుక్రష్షష్ఠవ్యయాష్టగః,
ఆదిత్యోదయవేళాయాం జాతో యమపురీం వ్రజేత్.

తా. పాపగ్రహములు కేంద్ర త్రికోణములయందును, శుక్రుఁడు ౬-౮-౧౨ ఈ స్థానములయందును నుండఁగా సూర్యోదయకాలమందు జనించినశిశువు మరణమును పొందును.

శ్లో. లగ్నపేవాంశపేవాపిజన్మకాలేస్తగౌ యది,
తదాజాతస్యపుత్రస్య మరణం స్యాన్నసంశయః.

తా. జన్మలగ్నాధిపతి అంశాధిపతి అస్తంగతులయివుండఁగా జనించినశిశువు మరణము చెందును.

శ్లో. లగ్నేశో వా త్రికోణేశో అంశేశో వా యదాతదా,
శత్రుస్థానగతా వాపి రంధ్రస్థాశ్చ మృతిప్రదాః.

తా. లగ్నాధిపతి, త్రికోణాధిపతి, అంశాధిపతి-వీరు శత్రుస్థానమందు నుండిరేని, లేక అష్టమస్థానమందు నుండిరేని అపుడు జనించినశిశువుకు మరణము కలుగును.

శ్లో. లగ్నేచంద్రోవ్యయే భానుః నవమస్థశ్శనిర్యది,
అష్టమే భూమిపుత్రస్తు సద్యోమరణమాదిశేత్,
లగ్నేవా పంచమేవాపి సప్తమే చాష్టమే యది,
భానుభౌమౌచ తిష్ఠేతాం పితుర్మరణమాదిశేత్.

తా. లగ్నమునందు చంద్రుఁడు, ౧౨-వ యింట సూర్యుఁడు, ౯-వ యింట, శని ౮-వ యింట అంగారకుఁడుండఁగా జనించినశిశువునకును తండ్రికిని తక్షణమే మరణము కలుగును. మఱియు లగ్నమునందుగాని, పైస్థానములయందు రవి కుజులు చేరిగాని, ప్రత్యేక ప్రత్యేకముగఁగాని యుండినపుడు శిశువు జనించిన తండ్రికి మరణము కలుగును.

శ్లో. కేతుంచతుష్టయే పుత్రం నవమం పితరం తథా,
అన్యత్రాన్యాంశ్చ తద్వంశ్యాః పాపదృష్టో దినత్రయే.

తా. కేతువు నాలుగవస్థానములోనుండి పాపులవల్ల చూడఁబడెనేని, లేక ౫,౯- ఈస్థానములను పాపులు చూచిరేని యపుడు శిశువుజనించిన పితకు అరిష్టము. పైస్థానముల

యందు రాహువుండి పాపగ్రహములచే చూడఁబడెనేని పితృవంశజులకు 3 దినములలో అరిష్టము కలుగును.

శ్లో. భూసూనుదృష్టోఽన్యజురత్రసప్తమే మంద్రోపి దేశంగతపీనతాతః,
శనైశ్చరక్షే నిశవక్రయుక్తో వక్రేన్యతీతే పితురేవ నాశః.

తా. యేడవస్థానమందు కుజుఁడుండి, వానిని శని నీచరాశియందు వక్రించి చూచెనేని, తండ్రి విదేశగతుఁడై తక్షణమే మరణమును పొందును. మఱియు శని వక్రించి నీచరాశి యందుండక 8-వ స్థానమున అంగారకుని చూచెనేని, శనికి వక్రము నివర్తించినతోడనే పితకు అరిష్టము కలుగును.

శ్లో. లగ్నంసౌరిర్నిరీక్షేత క్రూరగం శుభవర్జితం,
పితుర్మరణదం ప్రోక్తం న కేంద్రే దేవపూజితః.

తా. లగ్నమునందు క్రూరగ్రహములుండి శుభగ్రహ సంబంధవీక్షణములు లేకుండగా శనిచూచినను, కేంద్రమునందు బృహస్పతి లేకుండినను తండ్రికి అరిష్టము.

శ్లో. అర్కాశ్చాష్టమరాశిస్థస్తత్ర చేత్సౌరిలోహితౌ,
సౌమ్యగ్రహైర్న దృష్టాశ్చేత్పితుస్సద్యో మృతిప్రదాః.

తా. రవి కుజశనులు 8-వ స్థానమునుపొంది శుభగ్రహములచే చూడఁబడకుండిన తండ్రికి అరిష్టము.

శ్లో. ఆదిత్యచంద్రమందాశ్చ పంచసప్తవ్యయే గతాః,
వియుతాస్సహితాఃపుత్రే పితృమాతృమృతిప్రదాః.

తా. రవి, చంద్రుఁడు, శని 5-7-12 యీ స్థానములలో ప్రత్యేకముగఁగాని, లేక చేరిగాని ఉండునపుడు పురుషుఁడుజనించిన తండ్రికి, స్త్రీజనించిన తల్లికి అరిష్టము.

శ్లో. ఉదయే శశిభానూ చ సప్తమే యదిభూమిజః,
మాతుర్మరణ దాశ్చైవ సప్తరాత్రాన్న సంశయః.

తా. జన్మలగ్నమందు రవిచంద్రులు సప్తమమందు కుజుఁడునుండి, పైస్థానములను పాపగ్రహములుచూచిన కేంద్రత్రికోణములయందు శుభగ్రహములు లేకుండిన శిశువు యొక్క తల్లి యేడుదినములకు మృతినొందును.

శ్లో. శిశోర్విలగ్నే దశమే చార్కచంద్రార్కి సంస్థితే,
నదృష్టో గురుణా హంతి పితరం మాతరం సుతం.

తా. లగ్నమందు దశమమందు రవి చంద్ర శనులుకూడియుండి, గురుదృష్టి లేకుండిన, మాతా పితృ శిశువులకు అరిష్టము కలుగును.

శ్లో. చంద్రలగ్నాత్తు భూపుత్రః పంచమే సంస్థితో యది,
నదృష్టో గురుణా యత్ర మాతులం హంత్యసంశయః.

తా. చంద్రుడుండేలగ్నమునకు పంచమస్థానమందు కుజుడుండి, గురుదృష్టి లేకుండిన మేనమామకు నిశ్చయముగ అరిష్టము కలుగును.

శ్లో. తాతాంబికాసోదరమాతులాశ్చమాతామహీమాతృపితాచసూనుః,
సూర్యాదిఖేటాఃఖలుపంచమస్థాః తేషామరిష్టంమునయోవదంతి.

టీక. సూర్యాదిఖేటాః = సూర్యుడు మొదలగు గ్రహములు; పంచమస్థాఃయది= అయిదవరాశియం దుండెనేని; తాత-అంబికా-సోదర-మాతులాశ్చ, మాతామహీ-మాతృ పితాచ, సూనుః = తండ్రి, తల్లి, తోబుట్టువు, మేనమామ, తల్లియొక్కతల్లి, తల్లి యొక్కతండ్రి, కుమారుడు; తేషాం=వారికి; అరిష్టం = నాశమును; మునయః = మునులు; వదంతి = చెప్పుచున్నారు.

తా. పంచమమునందు సూర్యుడుండెనేని తండ్రికి, చంద్రుడుండెనేని తల్లికి, కుజుడుండెనేని తోడబుట్టువుకు, బుధుడుండెనేని మేనమామకు, గురువుండెనేని తల్లి యొక్కతల్లికి, శుక్రుడుండెనేని తల్లియొక్కతండ్రికి, శనియుండెనేని శిశువుకు అరిష్టము కలుగునని చెప్పవలయును.

## నక్షత్రగండములు

తిథ్యర్క్ష గండే పితృమాతృహాని ర్లగ్నస్య గండే తనయస్యనాశః,
సర్వేజనోజీవతిహంతిలగ్నే జీవే సుతస్యాదభివాహ్నికశ్చ.

తా. తిథినక్షత్రగండములు తల్లికి తండ్రికి అరిష్టము. లగ్నగండము శిశువుకు అరిష్టము. తిథినక్షత్రలగ్నగండములుచేరియుండిన పితృ మాతృ శిశువులకు అరిష్టము. లగ్నమునందు గురువుండిన పైదోషములు నివర్తించును.

అశ్విన్యాఃప్రథమేపాదే జన్మచే త్పితృదోషకృత్,
త్రిమాసావధి తద్దోషః శామ్యతి స్వర్ణదానతః.

తా. అశ్విని మొదటిపాదమునందు జననమైన పితృగండము. ఈదోషము మూడు మాసములవర కుండును. సువర్ణదానమువలన నిది నివారణమగును.

యామేతృతీయపాదే చ జాతో యదిభవేచ్ఛిశుః,
శిశోర్దోషో భవేత్తత్ర యావత్పాదచతుష్టయమ్.

తా. భరణి మూడవపాదమునందు జననమైన శిశువునకు ౨౭ దినములవరకు దోషము.

రోహిణీ ప్రథమేపాదే మాతులస్తు వినశ్యతి,
ద్వితీయే పితరం హంతి తృతీయే మాతరం తథా.
చతుర్థే యదిజాయేత పుత్రస్స్యాచ్ఛుభావహమ్.

తా. రోహిణీనక్షత్ర ప్రథమపాదమునందు పుత్రుఁడుజనించిన మేనమామకును, రెండవపాదమునందు జనించిన తండ్రికిని, మూఁడవపాదమందు జనించిన తల్లికిని, దోషము కలుగును. నాల్గవపాదమునందు జనించిన అందరికిని క్షేమము కలుగును.

పుష్యర్క్షే కటకేలగ్నే దివాచేత్పుత్రసంభవః,
పితృదోష స్తదా జ్ఞేయ స్తథా పుష్యేచ కర్కటే,
పుత్రీజన్మ నిశాయాం చేన్మాతృదోషం వినిర్దిశేత్.

తా. పుష్యమినక్షత్రము కర్కాటకలగ్నమందు పగలు పుత్రజననమగునేని పితృగండము. పుష్యనక్షత్రము కర్కాటలగ్నమునందు రాత్రి పుత్రికాజననమగునేని మాతృదోషము.

పుష్య ప్రథమపాదే చేజ్జన్మ మాతులదోషకృత్,
ద్వితీయపాదే మధ్యే చేజ్జననం తు త్రిమాసకం,
మాతులస్య భవేద్దోషః నివృత్తిర్గంధదానతః.

తా. పుష్యమి మొదటిపాదములో జననమైన, మేనమామకు దోషము; రెండవపాద మధ్యములో జననమైన మాతాపితృలకు గండము. ఇది మూఁడునెలలవరకు నుండును. గంధపుచెక్క దానముచేసిన నిది శమించును.

సర్పర్క్షే ప్రథమేపాదే జన్మచేచ్ఛుభకృద్భవేత్,
ద్వితీయే శిశుదోషస్స్యా త్తృతీయే మాతృదోషకృత్,
చతుర్థే పితృదోషస్స్యాన్నివృత్తి స్త్వన్నదానతః.

తా. ఆశ్లేషయొక్క మొదటిపాదములో జననమైన శుభము. రెండవపాదములో జననమైన శిశువుకు గండము. మూఁడవపాదములోనైన మాతృగండము. నాలుగవ పాదము నందైన పితృగండము. ఈదోషము మూఁడు నెలలవరకు నుండును. ఇది అన్న దానమువలన నివర్తించును.

ఆశ్లేషాంతే మఖాదౌ చ జ్యేష్ఠాంతే మూలభాదిమే,
రేవత్యంతేఽశ్వినీభాదౌ ద్వేద్వేతుఘటికేక్రమాత్,
పండితైర్దోషఘటికేప్రోక్తే తత్సంభవస్యహి,
గ్రహశాంతి శ్శిశోః కార్యేత్యాహు ర్జ్యోతిర్విదోబుధాః.

తా. ఆశ్లేషాంత్యము రెండుఘడియలు, మఖాప్రథమమున రెండుఘడియలు, జ్యేష్ఠాంతమున రెండుఘడియలు, మూలమొదట రెండుఘడియలు, రేవతి అంత్రమున రెండు ఘడియలు. అశ్విని మొదట రెండుఘడియలు - ఇవి దోషఘడియలనియు, వీనియందుఁబుట్టిన వారికి గ్రహశాంతి చేయించవలెననియుఁ జ్యోతిశ్శాస్త్రవేత్తలు వచించుచున్నారు.

మఖర్క్షే ప్రథమేపాదే జన్మ చేత్పితృదోషకృత్,
మాసపంచకపర్యంతం సదోషస్తస్య శాంతయే,
కర్తవ్య మశ్వదానంస్యాత్ పశ్చాత్పాదత్రయంశుభమ్.

తా. మఖ మొదటిపాదములో జననమైన అయిదు మాసములవరకు పితకు దోషము. ఇది అశ్వదానమువలన నివర్తించును. తక్కిన మూఁడుపాదములు శుభములు.

ఉత్తరా ప్రథమేపాదే చతుర్థే చ జనిర్యది,
పిత్రో స్సహోదరస్యాపి త్రిమాసావధిదోషకృత్,
తిలపాత్రప్రదానేన తచ్ఛాంతిస్తు భవేద్ధ్రువమ్.

తా. ఉత్తర మొదటిపాదములోను, నాలుగవపాదములోను జననమైన మాతృ పితృ సహోదరులకు మూఁడుమాసములవరకు దోషము. తిలపాత్రదానమువలన నిది నివర్తించును.

చిత్తాద్యద్విత్రిపాదేషు జననం తు శిరోర్యది,
పితుస్సహోదరాణాంచ షణ్మాసావధిదోషకృత్,
తచ్ఛాంతిర్వస్త్రదానేన భవిష్యతి న సంశయః.

తా. చిత్త మొదటిపాదములోను, రెండవపాదములోను, మూఁడవపాదములోను జననమైన మాతా పితృ సహోదరులకు ఆఱునెలలవరకు దోషము. ఇది వస్త్రదానమువలన నివర్తించును.

జ్యేష్ఠర్క్ష ఘటికాస్సర్వా విభజ్య దశధాదిమే,
భాగే మాతామహీదోషః పితామహ్యాద్వితీయకే.
పిత్రోర్దోషస్తృతీయేతు మాతృష్వసు రరిష్టకృత్,
చతుర్థే సోదరారిష్టం పంచమే శిశుదోషకృత్.
షష్ఠే తు శుభదం జన్మ సప్తమే దారదోషకృత్,
అష్టమే శిశుదోషస్స్యా న్నవమే పితృదోషకృత్,

దశమే మాతృదోషస్స్యా దేవంజ్యేష్ఠాఫలం విదుః.
తురీయపాదే జ్యేష్ఠర్క్షే శిశోఃజన్మ భవేద్యది,
నవమాసావధి తదా పితుర్దోషశ్చజాయతే,
దోషస్యాస్యభవేచ్ఛాంతిర్గోదానేన న సంశయః.

తా. జ్యేష్ఠానక్షత్రముయొక్క ఆద్యంతఘుడియలను పదిభాగములుచేసి, వానిలో మొదటిభాగమున జననమైన జాతకునియొక్క మాతామహికిదోషము, రెండవభాగమునం దైన పితామహికి దోషము, 3-వ భాగమునందైన తల్లిదండ్రులకును, తల్లి తోడఁబుట్టిన వానికి దోషము, నాల్గవభాగమందైన సహోదరులకు దోషము, అయిదవభాగమునందైన జాతకునికి దోషము, ఆఱవభాగమునందైన ఎవ్వరికి దోషములేదు, ఏడవభాగమునందైన కళత్ర వర్గమునకు దోషము, ఎనిమిదవభాగమునందైన జాతకునికి నాశము, తొమ్మిదవభాగము నందైన తండ్రికిదోషము, పదవభాగమందైతే తల్లికి దోషము అని జ్యేష్ఠానక్షత్రమునకు ఫలము చెప్పఁబడినవి. మఱియు జ్యేష్ఠానక్షత్ర నాల్గవపాదమునందు జననమైతే తొమ్మిది మాసములవరకు తండ్రికి దోషము. ఇది గోదానమువలన నిశ్చయముగా శాంతిఁబొందునని చెప్పెదరు. కలుగునని యెఱుంగవలయును.

జ్యేష్ఠాంతే పాదఘటికా మూలాదౌ పాదనాడికా,
మిళిత్వా యాఽర్ధఘటికాసాంతరాళాభిధాస్మృతా,
తత్రాంతరాళే జాతస్య దోషఃపుత్రస్య సంభవేత్,
స్త్ర్యపత్యం యదిజాయేతతస్యదోషో నసంభవేత్.

తా. జ్యేష్ఠాంతమున పాతికఘుడియు, మూలానక్షత్రము మొదట పాతికఘుడియ వెరశి అరఘుడియకు అంతరాళమని పేరు. దీనియందు మగశిశువుపుట్టిన శిశువుకు దోషము కలుగును. ఆడశిశువుపుట్టిన దోషములేదు.

మూలస్య ఘటికా స్సర్వాః విభజ్య ద్వాదశాంశతః,
ఆద్యేభాగే పితుర్దోషః ద్వితీయే మాతృదోషకృత్.
తృతీయే భ్రాతృదోషస్స్యా చ్చతుర్థే స్వసృదోషకృత్,
పంచమే శ్వశురారిష్టం షష్ఠే పితృవ్యదోషకృత్.
మాతృష్వసురరిష్టం చ సప్తమే భవతిధ్రువం,
అష్టమే ధనహానిశ్చ నవమే జీవనవ్యయః.
దారిద్ర్యం దశమేజన్మ భృత్యదోష స్తథాభవేత్,
ఏకాదశే ద్వాదశే తు జాతస్యారిష్టమావహేత్.

మాసత్రితయపర్యంతం దోషోఽయ మనువర్తతే,
శాంతిర్మహిష్యాదానేన దోషస్యాస్య భవిష్యతి.
మూలర్క్షే ప్రథమేపాదే జన్మచేత్పితృదోషకృత్,
ద్వితీయే మాతృదోషస్స్యా త్తృతీయే ధనహానికృత్
చతుర్థే జన్మ శుభద మేవం జ్యోతిర్విదోవిదుః.

తా. మూలానక్షత్రముయొక్క ఆద్యంత ఘడియలను పండ్రెండుభాగములుచేసి, వానిలో ౧-వ భాగమునందు జననమైన పితృదోషము, ౨-వ భాగమునందు జననమైన తల్లికి దోషము, ౩-వ భాగమునందు జననమైన భ్రాతకుదోషము, ౪-వ భాగమునందు జననమైన భగినికి దోషము, ౫-వ భాగమునందు జననమైన పిల్లనిచ్చినమామగారికి దోషము. ౬-వ భాగమున జననమైన తండ్రి తోడఁబుట్టినవారికి దోషము, ౭-వ భాగమున తల్లి తోడఁబుట్టినవారికి దోషము, ౮-వ భాగమున ధననాశము, ౯-వ భాగమున జీవననాశనము, ౧౦-వ భాగమున దారిద్ర్యము, ౧౧-వ భాగమున భృత్యులకు దోషము, ౧౨-వ భాగమున జాతకునికి దోషము. ఇవి మూఁడునెలలవరకు. తన్నివృత్తి మహిషదానము మఱియు మూలానక్షత్రము మొదటిపాదములో జననమైన తండ్రికి గండము, ౨-వ పాదము నందైన తల్లికి గండము, ౩-వ పాదము నందైన ద్రవ్యనాశము, ౪-వ పాదము నందైన శుభము, అని జ్యోతిశ్శాస్త్రవేత్తలు పచించెదరు.

పూర్వాషాఢర్క్షకేచాపే దివాపుత్రజనిర్యది,
పితృనాశం తదా ప్రాహు ర్జ్యోతిశ్శాస్త్రవిచక్షణాః.

తా. పూర్వాషాఢ ధనుర్లగ్నమందు పగలు పుత్రజనన మగునేని పితృనాశము అని జ్యోతిశ్శాస్త్రవేత్తలు వచించెదరు.

పూర్వాషాఢాధనుర్లగ్నే పుష్యర్క్షే కర్కటే తథా,
సూర్యోదయేఽస్తసమయేఽప్యర్థరాత్రే చ సంగతే,
యదిచేత్పుత్రజన్మ స్యాచ్ఛిశోర్దోష స్తదా భవేత్.

తా. పూర్వాషాఢాధనుర్లగ్నమందును, పుష్యమి కర్కటకలగ్నమునందును, సూర్యోదయకాల సూర్యాస్తమయకాలములయందును, అర్థరాత్రియందును పుత్రజననమైన ఆ శిశువుకు దోషము.

పూర్వాషాఢా ధనుర్లగ్నే జాతః పితృవినాశకృత్,
పుష్యకర్కటకేలగ్నే పితుర్మరణమాదిశేత్.

తా. పూర్వాషాఢ ధనుర్లగ్నమందుగాని, పుష్యమి కటకలగ్నమందుగాని శిశువు జనించిన తండ్రికి అరిష్టము.

రేవతీ తుర్యపాదేచే జననం పితృదోషకృత్,
సత్రిమాసాపధిర్దోష స్తచ్ఛాంతిస్స్వర్ణదానతః.

తా. రేవతి నాల్గవపాదమునందు. జననమైన మూఁడుమాసములవరకు పితృగండము. సువర్ణదానమువలన నది నివర్తించును.

అరిష్ట భంగయోగములు

లగ్నేశో బలసంయుక్తః కేంద్రగశ్చ త్రికోణగః,
అరిష్టయోగజాతాశ్చ బాలా జీవంతి నిశ్చయమ్.

టీక. లగ్నేశః = లగ్నాధిపతి; బలసంయుక్తః=బలవంతుఁడుగ నుండునేని; కేంద్రగశ్చ = కేంద్రములగు ౧-౪-౭-౧౦ ఈరాసులను బొందియుండినను, త్రికోణగః = ౫-౯ రాసులను బొందియుండినను; అరిష్టయోగజాతాశ్చబాలాః = అరిష్టయోగమునందుఁ బుట్టినబాలురును; జీవంతి = బ్రతుకుచున్నారు. నిశ్చయం = నిక్కువము.

తా. పూర్వోక్తారిష్ట యోగములందుఁబుట్టిన బాలురను లగ్నాధిపతి బలవంతుఁడై యుండెనేని కేంద్రములయందుగాని, మూలత్రికోణములయందుగాని యుండెనేని ఈ యోగమువలన బ్రతుకుదురనుట. లగ్నాధిపతికి ఈ శ్లోకోక్తగుణములుండిన పూర్వోక్తారిష్టయోగములు బాధింపవని భావము.

ఏకశ్శుభ స్సర్వబలేన యుక్తః కేంద్రత్రికోణోపగతః ప్రసూతౌ,
హత్వా త్వరిష్టంఖిలు ఖేచరాణాం దీర్ఘాయురారోగ్యతనుం కరోతి.

టీక. ప్రసూతౌ = జననకాలమందు; ఏకశ్శుభః = ఒక శుభగ్రహము ; సర్వబలేనయుక్తః = సమస్తవిధములగు బలములుగలవాఁడై; కేంద్రత్రికోణోపగతః = కేంద్రత్రికోణములను బొందినవాఁడగునేని; ఖేచరాణాం=ఇతరగ్రహములయొక్క; అరిష్టం = దోషములను; హత్వా = పోఁగొట్టి; దీర్ఘాయురారోగ్యతనుం = విశేషమగు ఆయుస్సును ఆరోగ్యమును గల శరీరముగలవానిగా; కరోతి = చేయుచున్నాఁడు.

తా. ఒక శుభగ్రహము సమస్తబలములుగలదై కేంద్రత్రికోణములను బొంది యుండెనేని, తక్కిన గ్రహములవలనఁ గలిగినదోషములను బోఁగొట్టి యా జాతకునికి దీర్ఘాయుష్యమును నీరోగశరీరమును ఒసంగును. ఈవిషయమునుగురించి మరియొక శ్లోకము,

ఏకోపి కేంద్రభవనే నవపంచమేవా రాత్రీశపుత్రసురపూజితభార్గ

వానాం, నిశ్శేషదోషమపహత్యసుఖిప్రసూతో దీర్ఘాయుషోఽపి గత
రోగభయాశ్చజాతాః.

అని దీనికిని పూర్వశ్లోకోక్తార్థమే యని యెఱుంగవలయును. మఱియు నొక
శ్లోకము గలదు.

బుధభార్గవజీవానాం కేంద్రే కోణేఽపివా బలీ,
సద్యోమరణయోగానాం ప్రోక్తానాం భంగకారణమ్.

తా. బుధ శుక్ర గురువులలో నొకఁడు కేంద్రత్రికోణములను బొందెనేని
క్రిందఁజెప్పఁబడిన తత్కాలమరణయోగములకు భంగము కలుగును.

జన్మకర్మసుతబంధుధర్మగే దేవపూజ్యభృగుసోమసంభవాః,
లక్షదోషమపి హంతి నిశ్చయం చాంధకారమివ భాస్కరోదయః.

టీక. దేవపూజ్య-భృగు-సోమసంభవాః = గురువును, శుక్రుఁడును, బుధుఁడును;
జన్మకర్మసుతబంధుధర్మగాః = లగ్నమునుగాని, దశమమునుగాని, పంచమమునుగాని, నవమ
మునుగాని పొందియుండిరేని ; లక్షదోషమపి = లక్షదోషములను; భాస్కరోదయః =
సూర్యోదయము; అంధకారమివ = అంధకారమునుబోలి; నిశ్చయం = నిశ్చయముగ;
హంతి = పోఁగొట్టుచున్నారు.

తా. గురు, శుక్ర, బుధులు - జన్మలగ్న, దశమ, పంచమ, నవమమునుబొంది
యుండిరేని, లక్షదోషము లుండినను సూర్యోదయమున చీఁకట్లు తొలఁగిపోవునట్లు
తొలఁగిపోవును.

గురౌ రాహౌ భృగౌ కేంద్ర స్థితే జీవేచ్ఛతంనరః,
గ్రహారిష్టం నిహంత్యాశు చంద్రారిష్టం తథైనచ.

టీక. గురౌ = గురువుగాని; రాహౌ = రాహువుగాని; భృగౌ = శుక్రుఁడు
గాని; కేంద్రస్థితే = కేంద్రములయం దుండిరేని ; నరః = ఆ మనుష్యుఁడు; శతం =
నూరేండ్లు ; జీవేత్ = బ్రతుకును. చంద్రారిష్టం = చంద్రుఁడుండెడి కేంద్రమును;
అనఁగా; చంద్రుఁడు కేంద్రముననుండెనేని; గ్రహారిష్టం= గ్రహములవలనఁ గలిగిన యరిష్ట
ములను (సర్వం) అన్నిటిని; ఆశు = శీఘ్రముగ; నిహంతి = పోఁగొట్టుచున్నాఁడు.

తా. గురువుగాని, శుక్రుఁడుగాని, రాహువుగాని కేంద్రమునం దుండెనేని
యా నరుఁడు నూరుసంవత్సరములు జీవించును. చంద్రుఁడు కేంద్రమున నుండెనేనియుం
పూర్వోక్తగ్రహముల దోషములను బోఁగొట్టును.

కృష్ణపక్షే దివాజన్మ రాత్రౌ జన్మ సితేయది,
పాపసౌమ్యేక్షితశ్చంద్రః హరత్యే వారిరంధ్రగః.

టీక. కృష్ణపక్షే = కృష్ణపక్షమునందు; దివా = మధ్యాహ్నమందు; జన్మ = ఉత్పత్తియు; సితే = శుక్లపక్షమందు; రాత్రౌ = రాత్రియందు, జన్మయది = ఉత్పత్తియగునేని; పాపసౌమ్యేక్షితః = పాపగ్రహములచేతఁగాని బుధునిచేతఁగాని చూడఁబడి; అరిరంధ్రగః = షష్ఠాష్టమములను బొందియుండిన; చంద్రః = చంద్రుఁడు; హరత్యేవ = హరించుచునేయున్నాఁడు.

తా. కృష్ణపక్షమందు మధ్యాహ్నమునను, శుక్లపక్షమందు రాత్రియందును జన్మముగలిగి, చంద్రుఁడు ౬-౮ యిండ్లయందుండి పాపగ్రహములచేతఁగాని, బుధునిచేతఁగాని చూడఁబడెనేని సమస్తదోషములు హరించును.

సౌమ్యభార్గవజీవానా మేకః కేంద్రగతో బలీ,
పాపదృగ్యోగహీనశ్చే త్సద్యోఽరిష్టస్య భంగకృత్.

టీక. సౌమ్యభార్గవజీవానాం = బుధ శుక్ర గురువులలో; ఏకః = ఒకఁడు; కేంద్రగతోః = కేంద్రములను బొందియుండి; బలీ = బలవంతుఁడై; పాపదృగ్యోగహీనశ్చేత్ = పాపగ్రహముల వీక్షణముగాని సంబంధముగాని లేనివాఁడగునేని; సద్యః = అప్పుడే; అరిష్టస్య = దోషమునకు; భంగకృత్ = భంగము కలుగఁజేయువాఁడగును.

ఏక ఏవహిలగ్నేశః కేంద్రసంస్థో బలాన్వితః,
అరిష్టం నిఖిలంహంతి పినాకీ త్రిపురం యథా.

టీక. ఏకఏవహిలగ్నేశః = లగ్నాధిపతియొక్కఁడే; బలాన్వితః = బలవంతుఁడై; కేంద్రసంస్థః = కేంద్రములయందుండెనేని; పినాకీ = రుద్రుఁడు; త్రిపురంయథా = త్రిపురములను సంహరించినట్లు; నిఖిలమరిష్టం = సమస్తదోషములను; హంతి = పోఁగొట్టుచున్నాఁడు.

తా. లగ్నాధిపతి బలవంతుఁడై కేంద్రములయం దుండెనేని, రుద్రుఁడు త్రిపురములను నశింపఁజేసినటుల సమస్తములగు దోషములను నశింపఁజేయును.

జీవజ్ఞాఫుజితా మేకః కేంద్రగః పూర్ణవిక్రమః,
అరిష్టం నిఖిలంహంతి క్రూరోఽపి పరమోచ్చగః.

టీక. జీవజ్ఞాఫుజితాం = గురు బుధ శుక్రులలో; ఏకః = ఒకరుఁడు; కేంద్రగః = కేంద్రమును బొంది; పూర్ణవిక్రమః = మిక్కిలి బలవంతుఁడై యుండెనేని; నిఖిలమరిష్టం = సమస్తదోషములను; హంతి = పోఁగొట్టుచున్నాఁడు. ఈగ్రహములలో నొకటి క్రూరోఽపి = తాత్కాలిక క్రూరత్వమును బొందియుండినను; పరమోచ్చగః = పరమోచ్చమును బొందియుండెనేని యోగభావమును ఇచ్చును.

తా. గురు బుధ శుక్రులలో రెండుగ్రహములు పరిపూర్ణబలవంతులై కేంద్రమును బొందెనేని, సమస్తదోషములను బోఁగొట్టును. ఈగ్రహములు తాత్కాలికముగ క్రూరత్వమును జెందియున్నను, పరమోచ్చమును బొందియుండెనేని యీఫలముల నిచ్చును.

ఆద్వాదశాబ్దా జ్జంతూనా మాయుర్జ్ఞానం న శక్యతే,
జపహోమ చికిత్సాద్యైః బాలరక్షాం చ కారయేత్.

టీక. జంతూనాం = ప్రాణులకు; ఆద్వాదశాబ్దాత్ = పండ్రెండవసంవత్సరము, వఱకు; ఆయుర్జ్ఞానం = ఆయుస్సు దెలిసికొనుట; నశక్యతే = శక్యపడదు. జపహోమ చికిత్సాద్యైః = జపముచేతను, హోమముచేతను, వైద్యచికిత్సచేతను; బాలరక్షాం = పసివానిరక్షణము; కారయేత్ = చేయించవలయును.

తా. ప్రాణులకు పండ్రెండుసంవత్సరములగుపర్యంతము ఆయుస్సు తెలిసికొనుట వీలుపడదు గాన, బాలురను జప హోమ చికిత్సాదులచేత రక్షించుకొనవలయును.

మధ్యే లగ్నేశ హోరేశరంధ్రేశానాం శనేరపి,
యోఽయం బలవిహీనస్స్యాత్తద్దశాసు మృతిర్భవేత్.

టీక. లగ్నేశ హోరేశరంధ్రేశానాం శనేరపిమధ్యే = లగ్నాధిపతి, హోరాధిపతి, అష్టమాధిపతి, శని, వీరిలో; యోఽయం బలవిహీనస్స్యాత్ = ఎవఁడు దుర్బలుఁడగునో; తద్దశాసు = ఆగ్రహముయొక్క దశలయందు; మృతిః = మరణము; భవేత్ = అగును.

తా. లగ్నాధిపతి, హోరాధిపతి, అష్టమాధిపతి, శని - వీరిలో నెవఁడు దుర్బలుఁడో వారి దశలయందు జాతకునికి మరణము కలుగును.

అష్టమాధిపలగ్నేశౌ షష్ఠవ్యయసమాశ్రితౌ,
తదీశౌ దేహరంధ్రస్థౌ యది దీర్ఘాయు రాదిశేత్.

టీక. అష్టమాధిపలగ్నేశౌ = అష్టమాధిపతియుఁ, లగ్నాధిపతియు; షష్ఠవ్యయసమాశ్రితౌ = ఆఱవరాశినిగాని, పండ్రెండవరాశినిగాని పొందినవారయి; తదీశౌ = షష్ఠవ్యయాధిపతులు; దేహరంధ్రస్థౌ = లగ్నమునందు గాని, అష్టమమునందుగాని యుండెనేని; దీర్ఘాయుః = జాతకుఁడు దీర్ఘాయుస్సుఁగలవాఁడని; ఆదిశేత్ = చెప్పవలయును.

తా. అష్టమాధిపతి లగ్నాధిపతులు షష్ఠరాశిని ద్వాదశరాశిని పొంది, షష్ఠవ్యయాధిపతులు లగ్నమునుగాని, యష్టమమునుగాని పొందియుండిరేని, యా జాతకుఁడు దీర్ఘాయుస్సుఁ గలవాఁడగును.

దేహాధీశ శ్శుభై ర్యుక్తో యదికేంద్ర త్రికోణగః,
స్వోచ్చస్వక్షేత్ర సంయుక్తో జాతో దీర్ఘాయురాప్నుయాత్.

టీక. దేహాధీశః = లగ్నాధిపతి; శుభైః = శుభగ్రహములతో; యుక్తః = కూడిన వాఁడై; కేంద్రత్రికోణగః = కేంద్రములనుగాని, త్రికోణములనుగాని పొందియుం; స్వోచ్చస్వక్షేత్రసంయుక్తః = తన యుచ్చక్షేత్రమునుగాని, స్వక్షేత్రమునుగాని పొంది యుండెనేని; జాతః = పుట్టినవాఁడు; దీర్ఘాయుః = దీర్ఘాయుస్సుగలవానిగా; ఆదిశేత్ = చెప్పవలయును.

తా. లగ్నాధిపతి శుభగ్రహములతోఁగూడి, ౧-౪-౫-౭-౯-౧౦ రాసుల యం దుండి స్వోచ్చస్థానమునుగాని, స్వక్షేత్రమునుగాని పొందియుండెనేని యా జాతకుఁడు పూర్ణమగు ఆయుస్సు గలవాఁడగును.

రాహు స్త్రిషష్ఠలాభస్థః శుభగ్రహ నిరీక్షితః,
స్వల్పాయురపి పూర్ణాయు ర్నిర్ధనోఽపి ధనీ భవేత్.

టీక. రాహుః = రాహువు; త్రిషష్ఠలాభస్థః = ౩-౬-౧౧ ఈ రాసులయందుండి, శుభగ్రహనిరీక్షితః = శుభగ్రహములచే చూడఁబడెనేని; స్వల్పాయురపి = స్వల్పమగు నాయుస్సుగలవాఁడైనను; పూర్ణాయుః = పరిపూర్ణాయుస్సుగలవాఁడుగాను; నిర్ధనోఽపి = దరిద్రుఁడైనను; ధనీ = ధనవంతుఁడుగా; భవేత్ = అగును.

తా. రాహువు తృతీయ షష్ఠ ఏకాదశము లందుండి, శుభగ్రహవీక్షణముఁగలిగి యుండెనేని, స్వల్పాయుస్సు గలవాఁడుకూడ పూర్ణాయుస్సుగలవాఁడగుటయేఁగాక దరిద్రుఁడైనను ధనవంతుఁ డగును.

అష్టమస్థే యదా రాహుః కేంద్రస్థానే బృహస్పతౌ,
తద్దోషోఽపి లయం యాతి చిరాయు స్తత్ర నిశ్చయః.

టీక. రాహుః = రాహువు; అష్టమస్థః యదా = అష్టమస్థానమున నుండెనేని; బృహస్పతౌ = గురువు; కేంద్రస్థానే = కేంద్రస్థానముల యందున్న; తద్దోషోపి లయంయాతి = ఆ రాహువు అష్టమమున నుండెడి దోషము నశించును. తత్ర = ఆ కాలమందుఁబుట్టినవాఁడు; చిరాయుః = పూర్ణాయుస్సు గలవాఁడగును; తత్ర = ఆవిషయమందు; నిశ్చయః = నిశ్చయము కలదు.

తా. రాహువు అష్టమస్థానమున నుండెడి దోషమును బృహస్పతి కేంద్రమున నుండెనేని నశింపఁజేసి, యా జాతకునికి పూర్ణాయుర్దాయము నొసంగును.